Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ జూలై నెల 25 వ తేది శుక్రవారం [నెం 19 రు

## ఈ వారంలో యుద్ధ వార్తలు.

### విమాన దాడులు.

16 వ తేది మధ్యాహ్నము బ్రిటిషు విమానములు రాటర్డాం రేవుపై భయంకరమగు దాడి సాగించి వేలకొలది బాంబుల వర్షించి రేవును విధ్వంసమొనర్చెను. నాటిరాత్రి మరికొన్ని విమానములు జర్మనీలోని హాంబర్గునందలి ఫాక్టరీలపైనను, బులోన్ మొదలగు ఫ్రెంచి కోస్తా రేవులపైనను వందలకొలది భయంకరమగు బాంబుల అగ్నివర్షము కురిపించెను. 17 వ తేది రాత్రి జర్మనీలోని రైనునదీ ప్రాంతమున కలోన్ మొదలగు పారిశ్రామిక పట్టణములమీదను, ఫ్రాన్సున జర్మను ఆక్రమిత ప్రాంతములపైనను భయంకరమగు దాడి సాగించెను. ఈ దాడిలో 9 శత్రువిమానములు ధ్వంసమొనర్పబడెను. 18 వ తేది రాత్రి బ్రిటిషు విమానములు దాడి సలుపలేదు. 19 వ తేది మధ్యాహ్నము ఫ్రెంచి తీరపు డంకర్కు రేవుపై బ్రిటిషు విమానములు పెద్ద దాడి సాగించినవి. బ్రిటిషు బాంబులవలన రేవులోవున్న మూడు పెద్ద నౌకలును (ఒక్కొకటి 6,000 టన్నులు) ఒక చిన్న నౌకయు (4,000 టన్నులు) ముంచివేయబడెను. ఆ దాడులనుండి అయిదు విమానములు తిరిగి రాలేదు. నాటి రాత్రి జర్మనీలోని హానోవరు పట్టణముమీదను, జర్మనీ వాయవ్యభాగమునందలి పారిశ్రామిక పట్టణములపైనను తీవ్రమగు దాడులు జరిగెనని జర్మనులే అంగీకరించిరి. 20 వ తేదిన రైను ప్రాంతమునందలి కలోను మొదలగు పారిశ్రామిక నగరములమీదకు వందలకొలది బ్రిటిషు విమానములు వెళ్లి వేలకొలది బాంబులతో బ్రహ్మాండమగు అగ్ని వర్షమును కురిపించెను. ఈ దాడులలో రెండు శత్రు విమానములు కూల్చబడెను. బ్రిటిషు విమానము లన్నియును తిరిగి వచ్చెను. 21 వ తేదిన పగలు ఫ్రాన్సునందు ఉత్తర భాగము పైనను, కోస్తా రేవులపైనను వందలకొలది బ్రిటిషు విమానములు మరల పెద్ద దాడిని సాగించెను. ఈ సందర్భమున జరిగిన పోరాటములో 8 శత్రు విమానములు పడగొట్టబడెను.

22 వ తేదీన పగలు ఫ్రాన్సు ఉత్తరభాగముపై జరిగిన దాడులలో 9 జర్మను విమానములు పడగొట్టబడెను మూడు బ్రిటిషు విమానములు తిరిగి రాలేదు. 23 వ తేదీ రాత్రి జర్మనీలో రైనునదీ ప్రాంతపు పట్నములమీదను, అందు ముఖ్యములగు మాన్‌హీం-ఫ్రాంకుఫర్టు పట్టణములపైనను బ్రహ్మాండమగు దాడి జరుపబడెను. బ్రిటిషు బాంబులవలన ఆ పట్నములలో లేచిన మంటలు అనేకమైళ్ల దూరము కనుపించెను.

16 వ తేదీ రాత్రి, చాల అల్ప సంఖ్యాకములగు శత్రు విమానములు మాత్రమే బ్రిటనుపై దాడి సల్పుటకు వచ్చెను. తూర్పు ప్రాంతమునను ఆగ్నేయ ప్రాంత పట్టణములపైనను కొన్ని బాంబులు పడెనుగాని అంత విస్తారమగు నష్టము గలుగలేదు. హతులైన వారి సంఖ్యగూడ చాల తక్కువ. 17 వ తేదీ రాత్రి బ్రిటను ఈశాన్యభాగపు ప్రధాన రేవుపట్టణమగు "హల్లు" మీద తీవ్రమగు దాడియే జరిగెను. ఎంతమంది ప్రజలు మరణించినది తెలియదు. కాని చాలమంది హతులై యుందురని అనుకొనుచున్నారు. ఇటీవల ఇంత తీవ్రమగు దాడి జరిగియుండలేదు. శుక్రవారము రాత్రి అక్కడక్కడ స్వల్పముగ బాంబులు పడెనుగాని, విస్తారమగు నష్టమెక్కడను కలుగలేదు. 19 వ తేదీన మిడ్లండ్సులో రెండు ప్రాంతములలో దప్ప బ్రిటను నందెక్కడను దాడులు జరగలేదు. 20 వ తేదీ రాత్రి చాల ప్రదేశములలో స్వల్పముగ బాంబులు వేయబడెను.

### ఆఫ్రికా-మధ్యధరా.

లిబియా (ఉత్తర ఆఫ్రికా) లో టొబ్రూకు రేవుదుర్గమున చుట్టు ముట్టబడియున్న బ్రిటిషు సైన్యములు 17 వ తేదీ రాత్రి అకస్మికముగ శత్రుసైనిక పంక్తులపైబడి, చాల నష్టము గలిగించెను. అక్కడక్కడ స్థానికములగు పోరాటములలో శత్రుల సాయుధ మోటారు దళములు వెనుకకు పారిపోయెను. 18 వ తేదీన మరల, బ్రిటిషు, ఇండియను గస్తీదళములు శత్రు పంక్తులపైబడి, చాలమందిని చంపి, కొందరను ఖైదీలుగా పట్టుకొని సురక్షితముగ తిరిగి వచ్చెను. 20 వ తేదీ రాత్రి బ్రిటిషు విమానములు బెంఘాజీ రేవుపైన తీవ్రమగు దాడి జరిపెను.

బ్రిటిషు సైనిక, విమాన, నౌకాదళము లన్నియు కలసి తిరిగి లిబియాపై దాడి సాగించుననియు, పెద్ద పోరాటము జరుగనున్నదనియు ఇటాలియను సైనికాధికారులు 20 వ తేదిన దెలిపిరి.

17, 18 తేదీలలో బ్రిటిషు విమానములు సిసిలీ దీవిపైనను, ఇటాలియను యుద్ధనౌకానిలయమగు పలార్మోపైనను దాడి సాగించెను. ఆ రేవు నందలి నౌకలలో కొన్ని ముంచి వేయబడెను మరికొన్నిటికి దెబ్బలు తగిలెను.

17 వ తేదీన, ఇటలీ నుండి ఉత్తర ఆఫ్రికాకు జర్మను సైన్యములను తీసుకొనిపోవుచున్న చాల నౌకలగుంపును బ్రిటిషు జలాంతర్గాములు బ్రిటిషు విమానములు కనిపెట్టి, బాంబులు వేసి, వానిలో 7 నౌకలను ముంచివేసెను. యుద్ధ నౌకల సహాయముతో ఆఫ్రికాకు సప్లైల తీసుకొనిపోవుచున్న మరియొక నౌకగూడ ఆరోజుననే ముంచి వేయబడెను.

సైప్రెస్ దీవి రాజధానియగు నికోసా పట్టణముపై జర్మను విమానములు 18 వ తేదీన బాంబులు వేసెను. ఒక శత్రు విమానము పడగొట్టబడెను.

19 వ తేదీ రాత్రి జర్మను విమానములు, బ్రిటిషు నౌకాకేంద్రమగు అలెగ్జాండ్రియా రేవుపై బాంబులు వేసెను. ఒకడు మరణించెను. నౌకలకెట్టి నష్టమును గలుగలేదు.

## అమెరికా - అట్లాంటిక్.

మే నెలలో సంయుక్త రాష్ట్రాలు 511 విమానములను మాత్రమే విదేశములకెగుమతి చేసెను. వానిలో అత్యధిక భాగము ఆంగ్లదేశమునకే పంపబడెను. బ్రిటనుకు పెట్రోలు సప్లై చేయుటకుగాను, మరి 100 నూనె ఓడలను ఇతర నౌకలను అమెరికను అధికారులు ఏర్పాటు లొనర్చుచున్నారు.

అమెరికా బ్రిటనుకు పంపిన విమానముల సంఖ్య ఈ వారము 1,000 ని దాటెను. సంయుక్త రాష్ట్రములలో విమానముల ఉత్పత్తి గత జనవరి మాసముకంటె నూటికి 43 వంతులు హెచ్చెను.

అమెరికా సంయుక్తరాష్ట్ర విమానములు, అట్లాంటికు సముద్రమార్గములలోగల అజోర్సుదీవులవద్ద (పోర్చుగలు వారివి) గస్తీ తిరుగుచున్నవని సెనెటరు పీలరుగారు వెల్లడించిరి. న్యూఫౌండుల్యాండునందలి అర్జెంటైనాలోను, బ్రిటిని డాడునందును క్రొత్త యుద్ధనౌకా కేంద్రములను నిర్మించుకొనుటకు సంయుక్తరాష్ట్ర ప్రభుత్వము నిశ్చయించుకొని పనుల ప్రారంభించెను. సంయుక్తరాష్ట్ర నౌకానిర్మాణశాలలలో రోజుకు ఒక నౌక చొప్పున నిర్మాణము ప్రారంభింపబడెను.

రూజ్వెల్టు అధ్యక్షుడు—సంయుక్తరాష్ట్రములలో రిజర్వ్ ష్టు సైనికులకు, దేశరక్షణ స్వచ్ఛంద సేవకులు మొదలగు వారికిని మరియొక వత్సర కాలము సైనిక శిక్షణము సాగింపవలెనని శాసనసభలకు సందేశము పంపెను. ఇంతవరకు ప్రజలందరకు 12 నెలలు మాత్రము శిక్షణ మొసగుచున్నారు. అమెరికాకు, ఆపాయమిపుడు మరింత దగ్గరయగుచున్నదనియు, తగినంత శిక్షితమగు సైనికబలములేనిచో, దేశరక్షణ దుస్సాధ్యమగుననియు రూజ్వెల్టు హెచ్చరించెను.

బొలివియా (దక్షిణ అమెరికా) రాష్ట్రమున నాజీ కుట్రదారులు, తిరుగుబాటుచేయదలచిరని తెలిసి, ఆ ప్రభుత్వము నాజీ సంఘములను రద్దుచేసెను. జర్మను రాయబారిని 24 గంటలలో దేశమునుండి వెడలిపోవలెనని ఉత్తరువుచేసెను. ఈ చర్యను సంయుక్తరాష్ట్ర ప్రభుత్వము పూర్తిగ బలపరచుచున్నదని దేశీయాంగశాఖ సహాయ కార్యదర్శి యగు సమ్నరు వెల్సుగారు ప్రకటించిరి.

సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము బ్రిటనుకు 42.5 కోట్ల డాలరుల ఋణ మొసంగుటకు అంగీకరించెను.

సంయుక్త రాష్ట్రములు వెంటనే అక్ష రాజ్యములపై యుద్ధము ప్రకటింపవలెనని న్యూయార్కు పోస్టు పత్రికలో సామ్యుయెల్ గ్రాఫ్టన్ గారు బలమగు వ్యాసమును వ్రాసిరి.

## రష్యా :

జర్మనీ - రష్యా యుద్ధంలో, ఈవారము చాల తీవ్రమైనది. ఉత్తరమున ఫిన్లాండునుండి దక్షిణమున బాల్టికు సముద్రమువరకుగల రంగమున ఉభయపక్షములను 90 లక్షల సైన్యము పోరాడుచున్నదనియు, చాల ప్రాంతములలో స్టాలిను దుర్గప్రాకారశ్రేణిని జర్మను సైన్యములు చేదించి లోనికి చొచ్చుకొనిపోయెననియు జర్మనులు ప్రకటించిరి.

మధ్యరంగమున, రష్యా రాజధానియగు మాస్కో నగరమునకు 200 మైళ్ల దూరముననున్న స్మోలెన్స్కు దుర్గమును 16 వ తేదీ నాక్రమించితిమని జర్మను సైనికాధికారులు ప్రకటించిరి. కాని రష్యనులు ఆవార్త అసత్యమని ఖండించిరి. అరోజుననే దక్షిణరంగమున జర్మను-రుమేనియను సేనలు, బెస్సరేబియా రాజధానియగు కిషినాఫ్ నగరమునుగూడ ఆక్రమించెను. యుక్రేనియా రాజధానియగు కీవు నగరమును జర్మను మోటారు సైన్యము లాక్రమించెనని గూడ జర్మనులు చెప్పుచుండిరి. కాని దానికివెనుక 80 మైళ్ల దూరముననున్న జిటొమూర్ దుర్గమువద్ద రష్యను సైన్యములు ఇంకను జర్మనులతో పోరాడుచునే యున్నవి. ఉత్తరమున, ఎస్తోనియా రాజధానియగు టాలిన్ నగరము జర్మనులచే నాక్రమింపబడుటకు పూర్వము, పూర్తిగ తగులబెట్టబడెనని ఫిన్లండు వైమానికులు తెలిపిరి. కీవునకు 120 మైళ్ల వాయవ్యమునగనున్న నొవొగ్రాడ్ వాలిన్స్కు నగరమును 18 వ తేదీ నాక్రమించితిమని జర్మనులు ప్రకటించిరి.

రష్యనులకుగల తుది రిజర్వు దళములు యుద్ధరంగమున ప్రవేశించినవనియు వాని నెదుర్కొనుచుంటిమనియు జర్మనులు ప్రకటించిరి. కాని ఈ నెల 21 వ తేదీ ప్రాంతమునకుగాని రష్యను సైనిక సమీకరణము పూర్తిగాలేదనియు, తమ రిజర్వుదళము లింకను రంగమునకు రాలేదనియు రష్యనులు వెల్లడించుచున్నారు. బెస్సరేబియా ప్రాంతమున రుమేనియను, జర్మను సైన్యములు రష్యనులచే చెల్లాచెదరు చేయబడి పారిపోయెననియు, ఒక రుమేనియను పటాలము అధికారులపై తిరుగబడి వారినిబంధించి తీసుకొనివచ్చి రష్యను సైన్యములలో జేరెననియు రష్యను అధికారులు ప్రకటించిరి. స్మోలెన్స్కు రంగములో ఒక విమానాశ్రయమువద్ద జర్మను వైమానికులు రష్యనులతో పోరాడ నిరాకరించి, విమానాశ్రయమునందున్న 8 విమానములను రష్యనులకు అప్పగించిరి. 17 వ తేదీన జరిగిన పోరాటములో, రష్యను సైన్యములు రూగవిచ్ నగరమును తిరిగి ఆక్రమించుకొనగల్గెను. ఈ పోరాటమున, జర్మను ప్రధాన సేనానులలో నొకరగు మేజరు జనరలు ఆటో లాన్సెరుగారు హతుడయ్యెను. 15 వ తేదీన జర్మను-రుమేనియను సైన్యములు నీస్టరునదిని దాటి ఆ ప్రాంతపు స్టాలిను ప్రాకార శ్రేణిని చేదించెనని జర్మనులు తెలుపుచున్నారు.

సోవియటు సైన్యములు విషవాయు సంబంధములగు ఆయుధముల నుపయోగించుచుండిరను వదంతి పూర్తిగ అసత్యమని రష్యను అధికారులు ఖండించిరి.

21, 22 తేదీల రాత్రులలో చాల జర్మను విమానములు రష్యా రాజధానియగు మాస్కోపై దాడి జరిపినవి. అవి ఎట్టి నష్టమును గల్గింపలేదనియు నగర పరిసరములలో బాంబులు వేసిపోయెననియు జర్మనులు చెప్పుచున్నారు.

రష్యనులు పట్టుకొనిన జర్మను సైనికులవద్ద విషవాయువు నుపయోగించుటకు సూచనలుగల రహస్య పత్రములు దొరకెను.

రష్యా-జర్మను పోరాటము చాల నెలలవరకు సాగుననియు, రష్యా రిజర్వు సైన్యములు రంగమును ప్రవేశించిన తరువాత జర్మనులు పూర్తిగ నోడింపబడుట నిశ్చయమనియు రష్యను సహాయ విదేశాంగమంత్రియగు లొజొవిస్కీగారు ప్రకటించిరి.

## బాల్కనులు - టర్కీ - ఈరాక్ - ఈరాన్.

సిరియా-టర్కీ సరిహద్దులయందు బ్రిటిషువారిని సైన్యముల కేంద్రీకరింప నిచ్చుచున్నందుకు జర్మనులు టర్కీ అధికారులకు ఆక్షేపణల దెలిపిరి. టర్కీ దక్షిణ తీరమునకు కొలది మైళ్ల దూరముననున్న సామోస్ దీవియందు యిటాలియనులు సైన్యముల కేంద్రీకరించి యుండిరి.

టర్కీ పరిపాలనయందున్న డార్డనెల్సును ఆక్రమించుకొను నుద్దేశముతో జర్మనులు, బల్గేరియనులు టర్కీ సరిహద్దు

లలో సైన్యముల కేంద్రీకరించుచున్నారు. డార్డినల్సుచు త్రేసునందలి తూర్పు పశ్చిమ ప్రాంతములను కలపి మేసడోనియా రాజ్యమను పేరుతో క్రొత్త రాజ్యమును నెలకొల్పుటకు జర్మనులు ప్లానల నిదివరకే సిద్ధపరచుకొని యుండిరని రష్యను అధికారులు తెలుపుచున్నారు.

బల్గేరియా ప్రధానియగు ఫిలాఫ్‌గారు, విదేశాంగ మంత్రి పొపాఫ్‌గారు 21 వ తేదీన ఇటలీకి వచ్చిరి. ముసులోనీ వారికి స్వాగతమొసగెను. బల్గేరియాకు టార్పెడో బోటులు మొదలగు ఆయుధ యంత్రసామగ్రిని సప్లైచేయించుకొనుటకును, ఉభయ దేశములకును గల సంబంధముల మరింత సన్నిహిత మొనర్చుకొనుటకును ముసోలినీతో సంప్రదించుటకుగాను ఫిలాఫ్ పొపాఫ్‌గార్లు వచ్చినటుల తెలియుచున్నది.

రష్యను విమానదాడుల వలన రుమేనియాలోని నూనె గనులలో చాలభాగము ధ్వంసమైపోయెను.

## నౌకా నష్టములు.

16 వ తేదిన బ్రిటిషువిమానములు, రాటర్డాం రేవు పట్టణముమీద జరిపిన దాడిలో బాంబులవలన, రేవునందున్న జర్మను నౌకల్లలో చాలభాగము ముంచివేయబడెను. 130—145 వేల టన్నుల పరిమాణముగల 22 శత్రునౌకలు శిథిలమొనర్పబడెను. మరికొన్ని విమానములు, ఫ్రెంచి కోస్తా ప్రాంతమున ప్రయాణమొనర్చుచున్న రెండు నూనె నౌకలను (ఒకటి [illegible],000 టన్నులు, మరియొకటి 3,500 టన్నులు) మరి రెండు సప్లై నౌకలను ముంచివేయబడెను. 19 వ తేదిన డచ్చిదేశపు సముద్రములో ప్రయాణమొనర్చుచున్న జర్మను నౌకలలో నాల్గు పెద్ద నౌకలు ముంచివేయబడెను ఫ్రెంచి తీర ప్రాంతమున మరి నాల్గు నౌకలు ధ్వంసమొనర్పబడెను. నాటిరోజున మొత్తం 4,800 టన్నుల శత్రు నౌకలు శిథిలమొనర్పబడెను. గత వారాంత్యమున 55 వేల టన్నుల శత్రునౌకలు బ్రిటిషు విమానములచేతను నౌకాదళముచేతను ముంచివేయబడెను.

లేడీ సోమర్సు అను బ్రిటిషు నౌక 20 వ తేదిన అట్లాంటిక సముద్రములో ముంచి వేయబడెను.

## దూరప్రాచ్యము.

జపానులో, 18 వ తేదిన కొనోయిగారు క్రొత్త మంత్రివర్గము నేర్పరచెను. అందులో ఇంతవరకు విదేశాంగ మంత్రిగనున్న మత్సువోకాగారు లేరు. ఇదివరకు యుద్ధాంగమంత్రిగనున్న టిజిరో టొయోడాగారు విదేశాంగమంత్రియయ్యెను. వీరుగాక ఇంకను చాలమంది సైనిక నాయకులును, మాజీ ప్రధానియగు హిరొనొమా మొదలగు మితవాదులును క్రొత్త మంత్రివర్గమునగలరు.

క్రొత్త మంత్రివర్గము జపాను అవలంబించు విదేశాంగ విధానమును ఇదమిద్ధమని ప్రకటించలేదు. క్రొత్త ప్రచురణ శాఖ మంత్రి 20 వ తేదిన ప్రసంగించుచు రష్యా, అమెరికా ఆంగ్లదేశము లొకటిగజేరి జపాను - ఇటలీ - జర్మనీలతో పోరాడును అభిప్రాయము సరియైనదిగాదనియు ఈ కక్షులు మారుటకింకను అవకాశము గలదనియు నుడివిరి. విదేశాంగమంత్రియగు టొయోడాగారు జర్మను, ఇటాలియను రాయబారుల పిలచి, ఆక్సి-రాజ్యాలతో గావించుకొనిన ఒడంబడికనుండి జపాను విడిపోలేదనియు తాము అవలంబించు విధానము ఆ యొడంబడిక ననుసరించియే యుండుననియు తెలిపిరి.

జపాను అధికారులు సోవియటు రష్యా సరిహద్దులలో సైన్యములను కేంద్రీకరించుచున్నారనియు, జపానులోగూడ క్రొత్త సైన్యములు సమీకరించబడుచున్నవనియు వదంతులు వ్యాపించుచున్నవి.

దక్షిణాఫ్రికానుండి జపానీయులందరును స్వదేశమునకు తిరిగివచ్చి వేయవలెనని జపాను ప్రభుత్వము ఉత్తరువు చేసెను. దూరదేశములకు పనియున్న నౌకలన్నియు వెంటనే మరలి రావలెననిగూడ ఉత్తరువులగావించిరి. వాటి ప్రకారము అమెరికా అట్లాంటికు తీరపు రేవులందున్న నౌకలు పనామా కాలువగుండ తిరిగి వచ్చుటకు ప్రయత్నింపగా ఆ కాలువకు లాకులు మరమ్మతులు జరగుచున్నవను కారణముచే నౌకలు పోవుటకు వెంటనే అనుమతుల నొసగలేదు. అందుచే, దక్షిణ అమెరికాను చుట్టి రావలసినదని తమ నౌకలకు జపాను అధికారు లిప్పుడు ఉత్తరువులు గావించిరి.

చైనాలో యుద్ధము మందగించెను. చైనాలోని కమ్యూనిస్టు సైన్యములకును, చాంగ్ కైషేక్ సైన్యములకును పోరాటము ప్రారంభమయ్యెననియు 8 వ కమ్యూనిస్టు సైనిక దళము షాన్సీ, షాంటుంగు రాష్ట్రములలో చాంగ్ కైషేక్ గారి సైన్యముల ప్రతిఘటించి పోరాడుచున్నదనియు చైనా సైనికాధికారులు ప్రకటించిరి.

జపాను మంత్రివర్గముల మార్పులను, రష్యా జర్మను యుద్ధ ఫలితములను, సయాము ప్రభుత్వము అలజడితో గమనించుచున్నది. సయాము, ఇండో-చైనాలపై జపానీయుల ఒత్తిడి ఇకమీద అధికమగునని భయపడుచున్నారు.

ఇండో-చైనా దేశము నంతను తమ సైన్యములు ఆక్రమించుటకు 24 గంటలలో అంగీకారమును తెలుపవలసినదని 22 వ తేదిన జపాను అధికారులు, ఇండో చైనాలోని ఫ్రెంచి అధికారులకు అత్య సందేశము పంపజేసిరని, విషీ ప్రభుత్వం అమెరికా సంయుక్త రాష్ట్రములలో తమ రాయబారికి తెలిపిరి. దాని కంగీకరింపనిచో బుధవారమునాడు జపాను దాడి ప్రారంభము కావలసియున్నది. కాని ఫ్రెంచి అధికారులు ఇండో చైనా దక్షిణభాగమున జపాను సైన్యముల నిలుపుకొనుట కంగీకరించి రాజీగా పరిష్కరించుకొనిరి.

సమ్నరు వెల్సుగారు జపాను రాయబారిని పిలచి దూరప్రాచ్యమున శాంతి రక్షణ సంయుక్తరాష్ట్ర కర్తవ్యమనియు జపాను చర్యలు తమకు అలజడి గల్గించుచున్నవనియు తెలిపెను. సంయుక్తరాష్ట్ర నౌకా మంత్రియగు కర్నలు నాక్సుగారు దూరప్రాచ్యమున అమెరికా విధానమును అమలుజరుపుటకు అచట తగినంత నౌకాబలము సిద్ధముగ నున్నదని పల్కెను.

## విషీ.

ఆఫ్రికాలోని ఫ్రెంచి సోమలీల్యాండు ప్రస్తుతము విషీ ప్రభుత్వముక్రింద నున్నది. అందలి జిబూటి రేవునుండి అబిసీనియాకు పోవుటకు ఒకే రైలుమార్గముగలదు. ఫ్రెంచి సోమలీల్యాండు అధికారులను, విషీ ప్రభుత్వమును నిరాకరించి స్వతంత్ర ఫ్రెంచి ప్రభుత్వముక్రింద జేరవలెనని, బ్రిటిషు సైనాధికారులు కోరిరి. వారందు కంగీకరింపలేదు. ఫ్రెంచి సోమలీల్యాండునందలి ఫ్రెంచి స్త్రీలను పిల్లలను ఖాళీచేయించవలసినదనియు, అందుకు తాము సౌకర్యము లొసగెదమనియు బ్రిటిషు అధికారులు తెలిపిరి. దీనికిని ఫ్రెంచి అధికారులనుండి జవాబురాలేదు. అందుచే ఫలానితేదిలోగా, ఖాళీ చేయించవలసినదని నిర్ణయించుచు బ్రిటిషు అధికారులు జిబూటీలోని ఫ్రెంచి అధికారులకు తెలియజేసిరి.

సిరియాను ఆక్రమించుటను, బ్రిటిషు సైన్యములు 21 వ తేదికి పూర్తిచేసెను. బ్రిటిషు సైన్యములు టర్కీవైపు సరిహద్దుల ప్రాంతము నాక్రమించెను. విషీ ఫ్రెంచి సైనికులలో చాలమంది బ్రిటిషు పటాలములలో చేరుచున్నారు.

సిరియా అంతటియందును 20 వ తేదిన సైనిక శాసనము ప్రకటింపబడెను. ఈ "మార్షలు లా" యెంతకాలముండునో నిర్ణయింపబడలేదు.

18 వ తేదిన విషీ మంత్రివర్గమున చాలమార్పు లొనర్పబడెను. పేరీ ఫ్లాండన్‌గారు దేశీయాంగ మంత్రిగ నియమింపబడిరి. జర్మనుల సంతృప్తిపరచుటకు ఇంకను మరికొన్ని మార్పులు గావింపబడునని తెలియుచున్నది.

## ఆక్రమిత దేశములు.

ప్రజా ప్రభుత్వముల విజయము కొరకు ప్రారంభింపబడిన "వి." ప్రచారోద్యమము జర్మను ఆక్రమిత ప్రాంతములలో విరివిగ వ్యాపించుచున్నది.

జర్మనులు ఆక్రమించిన బాల్టికు దేశములు స్వతంత్ర దేశములుగ ప్రకటింపబడుననెడు వదంతులు అసత్యమనియు, ఆ దేశములనన్నిటిని, జర్మను రాజ్యములో ఒక భాగముగనుంచుకొనుటకు జర్మను అధికారులుద్దేశించుచుండిరనియు తెలియుచున్నది.

జర్మనులు ఆక్రమిత ప్రాంతములందు ఎంతయో నిర్బంధ చర్యలనవలంబించుచున్నను, తిరుగబాటు చర్యలు హెచ్చుచున్నవి. జర్మను సైనికులు ప్రయాణ మొనర్చు రైలు బండ్లు ప్రేల్చి వేయబడుచున్నవి. చాలమంది జర్మను సైనికాధికారులును ఆయుధ సామగ్రులును ప్రతి దినము మాయమగుచున్నవి అని మాస్కో రేడియో ప్రకటించెను.

## తటస్థ దేశములు.

ఐర్లండు ప్రధానియగు డివెలెరాగారు శాసన సభలో ప్రసంగించుచు, ఐర్లండు, తటస్థముగనేయుండుననియు, ఎవరు ఐర్లండుపై దాడి ప్రారంభించినను కృతనిశ్చయముతో నెదుర్చుననియు ప్రకటించెను.

స్పెయిను ప్రభుత్వనాయకుడగు ఫ్రాంకో సేనాని 18 వ తేదిన విదేశీయ రాయబారుల ఎదుట ఉపన్యసించుచు సోవియటు రష్యాను తీవ్రముగ ఖండించి, జర్మను దాడిని సమర్థించెను. కాని తన విదేశాంగపంథాయందు మాత్రము యెట్టి మార్పును ప్రకటింపలేదు.

ఐరోపాయందింకను మిగిలియున్న స్వతంత్ర దేశముల గూడ ఆక్రమించుటకు జర్మనులు సన్నాహములు గావించుచున్నటుల తనవద్ద సాక్ష్యముగలదని అమెరికా సంయుక్త రాష్ట్రీయ దేశీయాంగ సహాయ కార్యదర్శియగు సమ్నరు వెల్సుగారు ప్రకటించిరి.

బ్రిటీషు రాజ్యమునకు చెందిన ఇండియా దేశపు సైనికులు.



ఉత్తర ఆఫ్రికా దేశములోని పడమటి ఎడారియందలి శత్రుస్థానమును పటములో వేయుటకు కనిపెట్టుచున్న ఇండియా దేశపు తుపాకి పటాలము తాలూకు ఒక ఉద్యోగిని పై పటములో చూడనగును.

# రషియా - జర్మనీ పోరాటం: మొదటి నెల వృత్తాంతం.

### 130 మైళ్లలోపునకు చొరగల్గిరి - రషియా ప్రవేశంతో హిట్లరు సుడి తిరిగినట్లే.

జూలై 22 వ తేది శనివారంతో రషియాపై జర్మనీ యుద్ధం రెండవ నెల ప్రారంభమయింది. మొదట్లో శత్రువులు కొంత చురుకుగానే పనిచేసి 1939 వ సంవత్సరములో నేటి యుద్ధం ప్రారంభమైనప్పటినుండి రషియా ప్రభుత్వం ఆక్రమించిన ప్రదేశమంతా జర్మనులు తీసుకోగల్గిరి. దూరదృష్టితో రషియానియంత స్టాలిను ముందుగనే ఎస్టోనియా, లాట్వియా, లిథూనియా దేశములను, పోలండు తూర్పు భాగం, బెసరేబియాల నాక్రమించి తనకు జర్మనీకి మధ్య కొంత ప్రదేశం అడ్డుగనుంచగల్గుటచేతనే యిప్పుడు లెనిన్‌గ్రాడు మాస్కోలపై జర్మనులదాడి నెదిరించి నిలువరించుకోగల్గెను. జర్మనులు పై చెప్పిన ప్రాంతాలన్ని ఆక్రమించి రషియా పూర్వపు సరిహద్దులు చేరుసరికి రషియనులు వారిని శిక్షించేరు. 25 రోజులు తీవ్రయుద్ధం చేసినపిమ్మటనే రషియా నేలలో జర్మనులు కాలుపెట్టగల్గిరి.

ఉత్తర రంగం:—ఉత్తర భాగమున వారు ప్రస్కోవ్, నవోగ్రాడులపై నుంకించి బెదరించుచున్నారు. ఈ నవోగ్రాడు వేరు. రషియా దక్షిణ భాగమున మింస్కు-చేరువ వేరొక నవోగ్రాడు-వొలిన్స్కు అను నగరంగలదు. అదీ.

యిది ఒకటనుకోరాదు. ప్స్కోవ్ లాట్వియా-రషియా సరిహద్దునందుంది. దానికి యీశాన్యంగా 120 మైళ్ల దూరాన నవ్‌గ్రాడు పురముంది. రెండును లెనిన్‌గ్రాడునకు 125 మైళ్లు దూరాన గలవు. ఇటునుంచి లెనిన్‌గ్రాడు పురిమునకు గల త్రోవను ఘట్టి రషియా సేన యొకటి కాపాడుచున్నది. జర్మనీ వశమందున్న ఫినిషు సేనలు మార్షలు మనరుహీముగారి నాయకత్వమునందుండి గూడ, యీ రషియా సేనను యెదిరింపజాలకున్నవి. జర్మనులు మాత్రం చాలగెలుపులు పొందేమని చెపుతూవుంటారు.

మధ్య రంగం:—ఇచట తెల్ల రషియాయందు 130 మైళ్లు ముందుకువచ్చుటకు జర్మనులకు పూర్తిగ ఒక నెల పట్టినది. మాస్కోకు 200 మైళ్లు దూరంలోనున్న స్మోలెన్స్కు అను పరిశ్రమల నగరంవరకు రాగల్గిరి. ఆ పురం తీసుకున్నామని జర్మనులు ప్రకటిస్తున్నారు; కాని యింకా ఆ పురంచుట్టూ తీవ్రంగా యుద్ధం జరుగుచున్నదనియు, తిరిగి తాము దానిని వశపరచుకొన్నామనియు రషియనుల చిట్ట చివరి ప్రకటన తెల్పుచున్నది. మొదట జర్మనులు పోలండు సరిహద్దు పొడుగునా సైన్యాలనుంచి జూన్ 22 వ తేదిన సరిహద్దు దాటించి పోలండు భాగమంతా అతివడిగా ఆక్రమించిరి. లిథూనియా, బైలిస్టాకు ప్రాంతములందు చాల రషియను సేనలను చుట్టివేసితిమనిరి. కాని తమ సేనలు దాగొని ముందుకు సాగివచ్చిన జర్మను సేనలను వెనుకనుండి కొట్టుచున్నవని రషియనులనుచున్నారు.

దక్షిణ రంగం:—ఉక్రైను ముఖ్యపట్నమగు కీవ్ నగరం పట్టుకొనుటకు దాడివచ్చిన జర్మను సేనలు యింకా బెసరేబియాయందే వున్నవి. జర్మనులు ల్వొవుపురం తీసుకొనిరి. కాని రషియనుల నిరోధం ఎక్కువగుటచే ఆ ప్రాంతంవిడచి లక్కుమీదుగ కీవుపై దాడిచేయ ప్రయత్నించిరి. ఈ విషయం ముందుగ గుర్తించే రషియనులు తగు రక్షణ యేర్పాటులు చేసియున్నారు. బెసరేబియా ముఖ్యపట్నమగు కిషినావు పట్టుకన్నామని రుమేనియా సేనలు (జర్మనీ మిత్రవర్గ సైన్యం) ప్రకటించుచున్నవి. రషియాలోనిదేయగు నొవగ్రోడు-వాలిన్స్కు జూలై 4 వ తేదిన ప్రవేశించి వశపరచుకొంటిమని జర్మనులు ప్రకటించిరి. కాని స్టాలిను ఉత్తరువుల ప్రకారం శత్రువుల వశమయ్యేలోపున కిషినావు మున్నగు పురములను పూర్తిగ ధ్వంసంచేసిరి. పనికొచ్చేవస్తువులేవి అందులో రషియనులు వుంచలేదు. జర్మను లాక్రమించిన ప్రాంతాలలో రషియను గొరిల్లా సైన్యాలు వారిని నిలువనివ్వకుండా చీకాకుచేయుచు, జర్మను సేనయొక్క మందు గుండు విశేషంగ నష్టపెట్టుచున్నవి.

ఈ రీతిగ నెల రోజులు తీవ్రయుద్ధం జరిగిన పిమ్మటగూడ జర్మనులనుకున్న ప్రకారం లెనిన్‌గ్రాడు, కీవు, మాస్కో నగరములను చేరలేకుండిరి. స్టాలిను శిబిరశ్రేణిని అనేకచోట్ల భేదించితిమంటున్నారు. కాని యింకా అచటి యుద్ధం సాగుతూనేవుంది.

## రష్యనుల పద్ధతి.

ఆయితే రష్యనులకు ప్రమాదంలేకపోలేదు. మూడు చోట్ల రష్యా దేశంలోనికి జర్మనులు రాగల్గిరి. ప్స్కోవ్, పోర్కోవు (స్మోలెన్స్కు చేరువను), కీవువద్ద ఏపుడు ఫ్రెంచి వారు చేసిన పొరబాటును రష్య సేనలు చేయలేదు. ముందు వచ్చిన ఆయుధ మోటారు జర్మను దళములను టాంకులతో నెదుర్కొనుటయేగాక, వెనుకనున్న శత్రువుల పెద్దమోటారు దళములను అరికట్టుచున్నారు. కాని హిట్లరు నిర్లక్ష్యంగా విశేష సైన్యమును యంత్రాలను యుద్ధరంగంలో త్రోసివేస్తున్నాడు. స్మోలెన్స్కు ప్రాంతంలో చాల ముందుకు వచ్చెను. స్మోలెన్స్కుకు ఉత్తరమున దక్షిణమున విటుబెస్కు వోలి లెపులవద్దనున్న రష్యను సేనలను దూరం తొలగించగల్గితిమని నాజీలంటున్నారు. వెనుకనుండి రష్యనులువచ్చి తమ కేంద్ర జర్మను సైన్యములతో సంపర్కంలేకుండా తెగగొట్టతారేమో నని వారు కాచుకొనుచున్నారు. నవ్‌గ్రడు-వలిన్స్కు కీవ్‌ల మధ్యగూడ యిటువంటి పరిస్థితులే గలవు. ముందు వచ్చిన జర్మను శతుటాంకులను ఎదుర్కొనుచు, వెనుకనుండి వారికి సహాయంరాకుండా జర్మను మోటారు దళములను నిలిపివేయగల్గినచో ఎర్ర సైన్యం (రష్యా) విజయం పొందగలదు.

వెనుక 1812 వ సం॥న ఫ్రాంసు చక్రవర్తి నెపోలియను రష్యా సరిహద్దును జూన్ 24 వ తేదీనే దాటి దాడిచేసెను. అప్పుడు మోటారుదళములు లేనందున, వానికన్న వడిగానే యిపుడు హిట్లరు మోటారు దళములు ముందుకు సాగిపోయినప్పటికీ, రష్యనులకు ఘట్టి దెబ్బ కొట్టలేకపోయిన నెపోలియనువలెనే హిట్లరుకూడ యింతవరకు విఫలుడయ్యెను.

విమాన నౌకాదళములుకూడ యుద్ధం సాగించుచున్నవి. ఈ వారం బాల్టిక్ సముద్రంలో కాపలాతో పోవుచున్న 12 నౌకలను ముంచితిమని సోవియటు ప్రభుత్వం ప్రకటించెను. రుమేనియాలోని చమురుగనులుగల ప్లోయెస్టి, కాన్‌స్టంజా నగరాలపై రష్యను విమానాలు బాంబులువేసి నష్టపరిచినవి. ఫిన్లాండు పురములపైగూడ బాంబులు వేసినవి. ఈ మంగళవారంనాడు జర్మనులు మొదటిసారి రష్యా ముఖ్యపట్నమగు మాస్కో నగరంపై బాంబులు వేసిరి. ఆరుగంటలసేపు హెచ్చరికగ నుండెను ఎక్కువ నష్టం కలుగలేదుగాని 17 జర్మను విమానాలు పడగొట్టబడినవి.

## హిట్లరు ఎత్తు విఫలమయింది.

"రష్యాపై జర్మనీ దాడి సలిపి నాల్గు వారాలయినా, అంతటా రష్యా సైన్యాలు తీవ్రంగా ఎదుర్కొంటూ, ఎన్నో కష్టాల కోరుస్తూ, ధైర్యం వీడక యుద్ధం సాగిస్తూనే యున్నవి. హిట్లరనుకున్నట్లు వారి ధైర్యం తగ్గిపోలేదు. ఆక్రమించిన దేశాలలోకూడ రష్యనులు తిరుగబడుచూ చాల చికాకు చేస్తున్నారు." అని లండను టైమ్సుపత్రిక వ్రాస్తున్నది. రష్యాయొక్క పెద్ద పరిశ్రమలన్ని తూర్పున యుండుటే రష్యాయొక్క ముఖ్యబలము. కొన్నిచోట్ల అదృష్టవశాత్తు గెలుపొందిన మాత్రాన రష్యాను ఓడించజాలరు. ఒకే దెబ్బలో ఓడించాలనుకున్న హిట్లరు ఎత్తులు యిక్కడ సాగలేదు. రష్యా సేనలు తాము విడిచే పురములను ప్రదేశములను నాశనంచేసి విరమించుచున్నారు. రష్యా రక్షణ యేర్పాటులన్నియు కలసి కట్టుదిట్టముగ నుండునంత కాలం యిప్పటికది చెడలేదు. ఎంత ప్రాంతం జర్మనీ ఆక్రమించినా రష్యాయొక్క నిరోధించే శక్తిని పోగొట్టజాలదు.

ఇపుడు రష్యా-ఇంగ్లాండులు సఖ్యత ఒడంబడిక చేసుకున్నవి. బ్రిటనుపై దాడి జరపేలోపున రష్యాను అణచివేదామని హిట్లరు ఎత్తువేసెను. రెండో కార్యం చేయ వీలులేకుండా అతని మొదటి కార్యాన్నే భగ్నంచేయాలని బ్రిటిషువారి ఎత్తు. రష్యాకు అన్నివిధాలా చేయగలినంత సహాయం చేయాలి. ఇంగ్లాండు-రష్యా ఒడంబడికను సక్రమంగా వెంటనే అమలు జరిపినచో, హిట్లరు రష్యాలో ప్రవేశించిన దినమే యుద్ధం తిరుగుముఖం పెట్టిన దినంగా మారగలదు. హిట్లరు నుడి తిరిగినట్టే.

# “వి” విజయం గుర్తు.

## బ్రిటిషువారి అమోఘ ప్రచారము

## యూరోపులో కంటికగుపడని సైన్యం.

జర్మనీ ఆక్రమించిన దేశాలపై బ్రిటిషువారు విమానాలతో దాడిచేసి భీభత్స మొనరించుటేగాక, శత్రువును భయపెట్టి బెదరగొట్టుటకు “వి” ప్రచార మొకటి ప్రారంభించిరి. “వి” అను ఇంగ్లీషు అక్షరం విక్టరీ (అంటే విజయానికి) చిహ్నముగ నెంచబడెను. యూరోపు రాజ్యాలన్నింటిలో జూలై 20 వ తేదీ అర్ధరాత్రితో ప్రారంభించి “V” అను అక్షరం అన్ని గోడలమీద రోడ్లమీద వ్రాసి వేయడం, “వీ” అని కేకలువేయడం, అదే పల్లవిగ పాటలు పాడడం, చెవులు గింగురుమనునట్లు కేకలు వేయడం చేయవలసిందని బి.బి.సి. రేడియోద్వారా కర్నలు బ్రిటను అను వ్యక్తి, హెచ్చరించెను. ఈతని గొంతు యూరోపు దేశమంతటిపై పిడుగువలె మారుమ్రోగెను. ఆతడెవరో ఎవరికి తెలియదు. రేడియో అధికారులు చెప్పరు. కంటికగుపడని, ఎవరూ ఎరుగని యీ వ్యక్తి ఉత్తరువు ననుసరించి మాత్రం ఆనాటినుండీ, జర్మనీ ఆక్రమించిన ప్రాంతాలన్నింటిలో గోడలపై విజయ చిహ్నం ముద్రింపబడింది. రోడ్లనిండా “వి” ఆకారంగల కాగితాలు కత్తిరించివేయబడియున్నవి. మిత్రమండలి విజయ సూచనయగు యీ “వి” ప్రచారం అణచివేయుటకు నాజీలు మొదట చాల కఠిన శిక్షలు విధించినట్లు కోపెనుహాగనునుండి వార్తవచ్చెను. జర్మను సైనికాధికారులున్న యింటి గోడపై “వి” వ్రాసినందుకు ఒకడికి 40 దినములు ఖైదు శిక్ష విధించిరి. నాజీ జర్మనులు యీ ప్రచారానికి భయపడుటకు కారణం లేకపోలేదు.

### చర్చిలు సందేశం.

నాజీలపై యీ నరాలయుద్ధం చర్చిలుగారే జూలై 20 వ తేదీన ప్రారంభించిరి. ఆ రాత్రి కర్నలు బ్రిటనుగారు బ్రిటిషు రేడియోలో యిట్లు ప్రకటించిరి:—“ఇపుడే 20 వ తేదీ అర్ధరాత్రి గడిచింది. జర్మనీ ఆక్రమించిన ప్రాంతాలన్నిటికి నేను బ్రిటిషు ప్రధాని సందేశం తెల్పుచున్నాను. “వి” అను అక్షరము ఆక్రమిత దేశాల ప్రజల దృఢ సంకల్పమును తెలుపు గుర్తు. నాజీక్రౌర్యం అంత మొందు శుభ సూచన. ఆక్రమించిన శత్రువుతో ఎట్టి జోక్యం పెట్టుకోకుంటే, అతని ఎత్తులు సాగక, యూరోపు త్వరలో స్వేచ్ఛను బడయగలదు. అని చర్చిలు సందేశము. క్రొత్తసైన్య సమీకరణం యిప్పుడే ప్రారంభించబడినది. విజయం చేకూరేవరకు నాజీ జర్మనుతో యుద్ధం కొనసాగించుటకు యిపుడే యూరోపులోనున్న పురుషులెల్లరు ప్రతిన గైకొనుచున్నారు. కొద్ది నిముషాలలో లక్షలు కోట్లు “వి” గుర్తులు గోడలపై తలుపులపైన రోడ్లపైన యూరోపు అంతట చిత్రింపబడతాయి. ఈ చీకటి సమయమే దీనికి సుముహూర్తం. ఈ కనబడని సైన్యంలో చేరిన గుర్తుగా మీరో “వి” ని ముద్రించండి రాత్రి పగలుకూడ ఆ పనిచేసి, అదే కేక వేయండి. జర్మనులు వింటారు. తమ కిష్టమయినట్లు నటిస్తారు. కాని వారి కిష్టముండదు. “వి” సైన్యం మంచి కట్టుదిట్టాలు కల్గియుండాలి. సమయం వచ్చినపుడు జర్మనులను అశక్తులుగా చేయగలదు. మీకు విజయమగుగాక”.

### జర్మనీ ఆందోళన.

ఈ ఉద్యమం విపరీతంగా వ్యాపించిపోవుట జర్మనీకి ఆందోళన కలిగించుచున్నదనుటకు ఎట్టి సందేహంలేదు. డా॥గోయిబెల్సుగారు (హిట్లరు ప్రచారణశాఖ మంత్రి) యీ “వి” గుర్తు తమ విజయ చిహ్నమే యని ప్రకటించెను. జర్మను భాషలో విజయానికి “సీజు” అంటారు. అందు “వి” శబ్దమే లేదు. అయినా “విక్టోరియా” అను పదమొకటి తమ భాషలో ఉందని చెప్పి దానికిది చిహ్నమనిరి. ఇది ఎట్లా వ్యాపించిపోయిందో జర్మను రేడియోలో వారు చెప్పిన మాటలబట్టే తెలియగలదు. జర్మను రేడియో యిట్లు ప్రకటించింది:—“వి” అంటే విక్టోరియా” ప్రేగులో యీ అక్షరం గోడలపైని, సినిమాలలోను, ట్రాముల పైని, బస్సుల పైని, వార్తా పత్రికలకు అడ్డంగాను ముద్రింపబడింది. క్రాకో, వార్సా మున్నగు పోలండు నగరాలు, డెన్మార్కు, నార్వే, హాలెండు, బెల్జియం, ఒకటేమిటి జర్మను సేనలుగల అన్ని నగరాలలోను యీ గుర్తు వ్రాయబడింది. “వి” గుర్తుగల పోస్టు కార్డులు ఫ్రాంసులో విరివిగ చెల్లుతున్నాయి. ఇంతవరకు యీ గుర్తులను ఆక్రమిత రాజ్యాలలో ప్రజలు రాత్రులందే ఏల వ్రాస్తున్నారో గోయిబెల్సుగారు చెప్పలేదు. జర్మనీవిజయం కోరేవారే అయితే యింతకు ముందు యీ పని ఏల చేయలేదు. జర్మను ఉద్యోగుల వీపులపై నేల అంటిస్తున్నారు?

ఇది అమెరికాకుగూడ వ్యాపించింది. ఇండియానా కౌంటీలో 300 అడుగుల ఎత్తున ఎల్యూమినం రేకతో అక్షరం చెక్కి అమర్చబడింది. వి-విజయం అను ప్రచారం యిదివరకెన్నడు తలపెట్టబడనటువంటి అత్యద్భుతమయిన ప్రచారమని అమెరికా వ్యాఖ్యాత రేడియోలో తెల్పెను. “జర్మనులాక్రమించిన ప్రాంతాలలో ప్రజలకు “వి” ప్రచారం శుభసూచకంగా ఆహ్లాదకరంగా నుండగలదు. నానాటికి వృద్ధిచెందుచున్న యీ విజయఘోషను, స్వాతంత్ర్యేచ్ఛను జర్మనులు అణచివేయజాలరని తెలిసి వారు ఉచ్ఛస్వరముతో “వి” విజయం ప్రకటించగలరు” అని న్యూయార్కు హెరాల్డు ట్రిబ్యును పత్రిక వ్రాసెను.

---

# అమెరికా సైన్యాన్ని సిద్ధంచేయుట.

## ఏడాది క్రిందటకన్న ఉపద్రవం హెచ్చిందనిగుర్తించుట.

## జర్మనీ దక్షిణమార్గమున అమెరికాపై బడునా ?

అట్లాంటికు సముద్రంవైపునుండియు, పసిఫికు సముద్రం వైపునుండియు తనపై శత్రువులు వచ్చిపడే సూచనలున్నాయని అనుమానంతో అమెరికా అందుకు సిద్ధమగుచున్నది. అందుకై యింతవరకు మూడు ముఖ్యమైన పనులు చేసెను.

(1) సముద్రాలపై స్వేచ్ఛావిహారం అన్నిరాజ్యాల నౌకలకు ఉండాలను పూర్వ సిద్ధాంతమును అమెరికా అధ్యక్షుడు రూజువెల్టుగారు వేరొకసారి ప్రకటించెను.

(2) అమెరికా యుద్ధనౌకలు అట్లాంటికు సముద్రం లోనికి చాలదూరం పోయి పశ్చిమార్థగోళమును రక్షించుటలో తలెత్తని అతడు నౌకాదళమును కోరెను. ఈ చర్య అమెరికా సంయుక్తరాష్ట్రములను భూఖండప్రాధాన్యతగల దేశంగాకాక, సముద్ర ప్రాధాన్యతగల దేశంగా మార్చివేసిం దని లండను టైమ్సుపత్రిక వ్రాసింది.

(3) జర్మనీసేనలు నార్వే ఉత్తరతీరాన జమచేయబడి దాడివచ్చుటకు ప్రయత్నించుచున్నవని అమెరికాకు వార్తలు చేరుచున్నవి. నార్వేతీరమున బెర్గను రేవులో జరుగుచున్న సైనిక విన్యాసములు యీ అనుమానం కలుగజేశాయి. అంతేకాక ఐసులాండు ప్రజల భావాలలో జర్మను రేడియో వార్తలు ప్రకటిస్తున్నారు. జర్మనులు ఐసులాండు ప్రజలను ఒకేనార్డికు జాతికి సంబంధించినవారని ప్రచారం చేస్తున్నారు. ఐసులాండు స్కాటులాండు తీరానికి 600 మైళ్ల దూరములో ఉంది. ఐసులాండు, గ్రీనులండు, న్యూఫౌండు లండులను జర్మనులు ఆక్రమింతురని ఊహించియే ముందుగ అమెరికా తన సేనలను ఐసులాండుకు పంపెను. అందువలన అమెరికాతీరంనుంచి 3,000 మైళ్లవరకు అమెరికా నౌకలకు రక్షణ యొసంగవలసిన బాధ్యత అమెరికా నౌకాదళమునకు ఏర్పడెను. ఆప్రాంతం యుద్ధరంగంగ ఎంచబడునని జర్మను లంటున్నారు.

అమెరికా ప్రతినెల వేలకొలది టన్నుల నౌకలను తయారుచేసి ఇంగ్లాండునకు యిస్తున్నది. క్రొత్తరకం యుద్ధ విమానాలు మందుగుండుకూడ నెలనెల పంపుతున్నది. జర్మనులు డేకరు (ఆఫ్రికాలో రేవు), బ్రెజిలు (దక్షిణ అమెరికాలో నొక రాష్ట్రం) మీదుగ దక్షిణమునుండి అమెరికాపై బడుదురని ఒక అనుమానం ఉంది. ఈ విషయం ఇంగ్లాండులోను అమెరికాలోను యిప్పుడు తీవ్రంగా చర్చింపబడుచున్నది. దీనికి ప్రతిగా దక్షిణాఫ్రికాలో గాంబియాకు దక్షిణంగా ఒక నౌకావళి కేంద్రస్థానమును అమెరికాకు కొలుయిచ్చుటగూర్చి ఆలోచిస్తున్నారు.

పసిఫికు తీర రక్షణ.

అమెరికా పడమరనున్న పసిఫికు సముద్రతీర రక్షణ విషయంలోగూడ ఎక్కువ శ్రద్ధ వహించుచున్నది. అచట జపానుతో తగవులో దిగితే తూర్పున అట్లాంటికు సముద్రమునందు అమెరికా బొడవ చేసుకోజాలదని హిట్లరు తలంచియుండును. కాని అట్లు జరగలేదు. జర్మనీకి ఆశా భంగమయింది. పైగా అమెరికా రష్యాకుగూడ సహాయం చేస్తానంది. ఈ సహాయం చేయడంవలన జపానుకి కోపం వచ్చి అక్షరాజ్యాలతో చేరిపోకుండా కూడ అమెరికా శ్రద్ధ వహించింది. రష్యా-జర్మనీల మధ్య యుద్ధం జరుగుచున్న విషయం గుర్తించినట్లు యింకా అమెరికా ప్రకటించలేదు. అంటే పసిఫికు సముద్రతీరానవున్న రష్యను రేవగు వ్లాడివిస్టాకునకు అమెరికా నౌకలు యిదివరకువలెనే యుద్ధ సామగ్రి గొంపోతూవుంటాయి. జపానుకి టిన్ను, రబ్బరు ఎక్కువగా కావాలి, యీ సరకు వ్లాడివిస్టాకు రేవుద్వారా అమెరికానుండి రష్యాకే చేరడం జపానుకి యిష్టముండదు. జపాను దక్షిణప్రాంతములో వ్లాడివిస్టాకుగూడ చేరినట్లు జపాను ప్రకటింపవలసిందిగా జర్మనీ, ఇటలీ పత్రికలు సూచిస్తున్నాయి. అంతేకాక ఇండో-చీనా, డచ్చి తూర్పు దీవులు, సింగపూరులమీదకు జపాను దాడి వెడలవలెనని జర్మనీ ప్రోత్సాహిస్తున్నది. అట్లా చేస్తే అక్కడ యుద్ధం ప్రారంభమయి జర్మనీకి పడమర ఇంగ్లాండు, అమెరికాల ఒత్తిడి తగ్గునని జర్మనీ ఉద్దేశంకాని అట్లా జరిగినా ఎదురొడ్డడానికి ఇంగ్లాండు, అమెరికాలు సిద్ధంగానున్నవి. జపానుతో జర్మనీ వియ్యాతం సఖ్యతగానుందో జర్మనీ దురద్దేశాలేమిటో అమెరికాకు తెలియును. జపాను అమెరికాల సఖ్యత చెడుటకెట్టి అవకాశం అవసరం కనబడదని అమెరికా రాజనీతిజ్ఞులు అంటున్నారు.

బ్రిటిషు రాయబారి హాలిఫాక్సు ప్రకటన.

దూర ప్రాచ్యదేశ పరిస్థితులను చర్చించుచు బ్రిటిషు రాయబారియగు హాలిఫాక్సు ప్రభువుగారు స్పష్టంగా యిట్లు ప్రకటించెరు :—"పసిఫికు సముద్రప్రాంతములందు శాంతి కాపాడుటే బ్రిటిషు ప్రభుత్వ స్థిరసంకల్పం. అమెరికాగూడ యిందు కంగీకరించుననుటకు ఎట్టి సందేహంలేదు. అందుకు శక్తివంచనలేక పాటుబడెదము. దూరప్రాచ్యమునందు ఇతర బలవత్తర రాజ్యాల హక్కు భుక్తములకు ఎట్టి హాని కలుగజేయకుండా నుండునంతకాలం జపానుతో మాకు తగవేలేదు. యుద్ధం వచ్చేటటువంటి దిక్కు ఏమిగలదో నాకు తెలియకున్నది. యూరోపులో యుద్ధం జరుగుచున్నదని గాభరాలో ఇంగ్లాండు ప్రపంచంలో యితర ప్రాంతములందు తనకుగల హక్కులను వదలుకొంటుందనుకోడం పొరబాటు. ఇతర దేశాల బుకాయింపులకు బెదిరింపులకు లొంగని దేశాలు యింకా కొన్ని ఉన్నాయని జర్మనీ తెలుసుకోవాలి."

అధ్యక్షుడు రూజువెల్టుగారి ప్రకటన.

అధ్యక్షుడు రూజువెల్టుగారు జర్మనీ ఉపద్రవమునుగూర్చి యీ సోమవారం మరల అమెరికా ప్రజలను హెచ్చరించిరి. వారి సందేశంలో యీదిగువ ముఖ్యాంశాలు గలవు :—

(1) అంతర్జాతీయ పరిస్థితులు ఏడాది క్రిందటికన్న యీ వేళ చాలా ప్రమాదకరముగ నున్నందున, మన సైన్య సంఖ్యను తగ్గించక, ఉపయుక్తమగునంత సంఖ్యను సర్వదా సిద్ధముగ నుంచవలెను.

(2) సైన్యాన్ని తగినంత సిద్ధంగా నుంచుటేగాక యింకా అధికంగా క్రొత్తవారికి శిక్షణ యొసంగవలెను. శిక్షణనందిన సైనికులలో శక్తివంతు, ఉద్యోగులలో శక్తివంతును తొలగించకొనుట మహాపరాధమగును.

(3) ఇపుడున్న సైన్యం కరిగిపోవుటకు వీలొసంగిన చో క్రొత్త సైన్యానికి శిక్షణ యొసంగుటకు కనీసం ఆరు నెలలైనా పట్టును.

(4) నేడు మనకు ప్రమాదం యిదివరకుకన్న చాల యెక్కువగావున్నదని నేను బాగా యెరుంగుదును. దేశోపద్రవకరమగు పరిస్థితు లేర్పడినవని నేను సత్యంగా ఎరుంగుదును.

(5) జర్మనీ చూపుచున్న నేర్పు క్రొత్త యుద్ధవిధానంగూర్చి అధ్యక్షుడు యిటు తెలిపెను :—యూరోపును నిలువుగాను, అడ్డంగాను చీల్చి చెండాడుట అనుకున్న కార్యక్రమం ప్రకారం అనుకున్న కాలంలో జర్మనీ ముగించివేసెను. ప్రతిసారియు అత్యధిక సంఖ్యా సైనికుల నుపయోగించుటేకాక ఎక్కువ శిక్షణ పొందినవారిని పంపెను. జర్మను ప్రభుత్వం భయంతొలగి ఒకదేశాన్నాక్రమించినపిమ్మట యింకొదేశాన్ని ఆక్రమించేముందు దానితో గల ఒడంబడికలను రద్దుచేసి దానిపైబడుటకు తగినంత వ్యవధి గైగొనుచున్నది. అట్టి చర్యల నెదుర్కొనుటకే యిపుడు సైన్యంలోచేరిన సెలక్టీవులు, గార్డుమెను రిజర్వులో నున్నవారు అందరు యింకో ఏడాది సర్వీసులో ఉండేటట్లు ఉత్తరువుచేయుటకు కాంగ్రెసు అనుమతిని కోరుచున్నాను.

వార్తాపత్రికల సూచనలను పూర్తిగ నమ్ముటకు వీలులేదు. కాని, యీ దిగువ చర్యలన్నిగాని, కొన్నిగాని అమెరికా ప్రభుత్వం చేయునని అవి వ్రాయుచున్నవి:—

(1) యు-బోట్లు (అంటే నీటిలో కనబడకుండా తిరిగే జలాంతర్గాములు) విమానాలు వచ్చినచో దారిదోపిడిగాండ్రవలెనెంచి తగుశిక్ష విధింపవలెనని అమెరికా నౌకా దళమునకు అధికార మివ్వబడును.

(2) అమెరికా వైమానికులు ఇంగ్లండునకిచ్చు విమానాలపై నెగిరి సరాసరి ఇంగ్లండుపోయి ఆ విమానాలను అందజేయవచ్చు. ఇదివరకువలె బ్రిటిషు నౌకలకు అప్పగించ నక్కరలేదు.

(3) ఆఫ్రికా చేరువగనున్న అజోర్సు, కేపువర్డి దీవులందు డేకరు రేవులోను నాజీ సైనికులు రహస్యంగా ప్రవేశింపకుండా కాచి చూచుచుందును.

అందుచే అమెరికాదేశం జర్మనీయొక్క ప్రథమ శత్రువుగ జర్మను పత్రిక లెంచుచున్నవంటే ఆశ్చర్యంలేదు. అధ్యక్షుడు రూజువెల్టుగారు ప్రపంచాధిపత్యం ఆశిస్తున్నాడనికూడా అవి వ్రాస్తున్నాయి.

## ఇండియను కార్మిక దళం.

భారతీయ సైన్యంలో పేరు ప్రఖ్యాతులు లేకపోయినా పని పాటులు తక్కువకాకుండా ఉండేది కార్మికదళం. ఇందు చేరినవారు యుద్ధం జరుగుతున్నప్పుడేకాక, యుద్ధానికి ముందు వెనుకగూడ చాల ముఖ్యమగు పనులు చేస్తూ ఉండాలి. రాత్రి పగలుకూడ ఉత్సాహం ఉండవలయునట్టి కూలిపని వీరు చేస్తూఉంటారు. స్టీమరులలోనుండి సామానులు దించి మోటారు ట్రక్కులలో ఎక్కించుట మున్నగు పనులు వీరివంతు. వాళ్లకూ సిపాయిలవలె దుస్తులు ఒసంగబడును. యుద్ధంలో పాల్గొనే సిపాయిలకు అవసరం వచ్చినపుడు ఆ పనియందుగూడ తోడ్పడుతూ ఉండాలి. కాని సాధారణంగా వీరిపని నేర్పవసరంలేని కూలిపని. దేహదారుఢ్యం, కష్టసహిష్ణుత ఓర్పు మెండుగ ఉన్నవారినే యీ కార్మికదళంలో చేర్చుకుంటారు.

వారిని సిపాయిలకన్న తక్కువగా చూడరు. వారికిచ్చే యూనిఫారము దుస్తులలో గౌరవముంది. సామాన్య కూలీలకు వాటికి అదే తేడా. లేబరు కోరు (కార్మికదళం) లో చేరినవారు సైన్యంతో చేరి పని చేయుచున్నాముకదా యని సంతోషంతో గర్వంగాయుందురు.

మలయాదేశంలో సైనికులకు వున్న సౌకర్యాలన్ని వీరికి వున్నాయి-ఆటస్థలాలు, సినిమాలు, రేడియో. వీరు పాశ్చాత్య సంగీతమునందు యెక్కువ అభిమానం చూపుతున్నారు. ఇంగ్లీషు సినిమాలంటేకూడ యెక్కువ అభిలాష, హిందూస్థాని వార్తలనే వినుచుందురు. చుట్టలు త్రాగుచుందురు. చిన్న చొక్కాలు బనియనులు వేసుకొని కబురులు చెపుతూ మొంతో ఆనందంగా కాలం గడిపివేస్తున్నారు.

## భారత సంస్థానముల యుద్ధ సహాయము.

నాల్గు రెజిమెంటుల గుర్రపు దళములు, ఐదు బాటరీలు (ఫిరంగి దళం), ఒక ఆర్టిలరీ సెక్షను, నాల్గు కంపెనీలు, ఒక సేపరులు మైనరుల దళం, 23 బెటాలియనుల కాల్బలము, ఒక ఒంటెల దళము, సామాను రవానా చేయు జంతు దళములు కూడు—ఇవన్నీ 1940 వ సం॥ ఏప్రిల్‌నుండి 1941 వ సం॥ ఏప్రిల్‌లోగా భారతీయ సంస్థానములనుండివచ్చి బ్రిటిషు సైన్యంలో చేరినవి. ఇంకా యెక్కువ సహాయముకూడ సంస్థానములు పంపినవి.

ఇవిగాక 18 సంస్థానములందు జత చేయబడి 11 సరకు రవానా దళములు పంపబడెను. వీరిలో తక్కువపడిన సంఖ్య భర్తీచేయుటకును, క్రొత్తవారిని చేర్చుకొని శిక్షణ యొసంగుటకును ఆ సంస్థానాలే పూచిపడును. రెండు సంస్థానములు రెండు కార్మిక దళం కంపెనీలను పంపినవి. మూడు సంస్థానాలు మూడు వైద్యసహాయ దళములను పంపినవి. సంస్థానముల సైన్యంనుండి సిగ్నలర్లు (సౌజ్ఞలుచేయువారు) 170 మంది ఇండియను సైన్యములో చేరిరి.

బ్రిటిషు రాజుగారి సైన్యములో తమ సేనను చేర్చుటకును, చేరిన సేనలో ఖాళీలు భర్తీచేసి క్రొత్తవారిని పంపుచుండుటకును భారతీయ సంస్థానములు ఒకదానితో నొకటి పోటీ పడుచున్నవి. ప్రతి సంస్థానములోను సైన్యాలను చేర్చుకొని, వారికి శిక్షణ యొసంగుట సరకు చేకూర్చుట మున్నగు పనులు అత్యంత అధికరిగా జరుగుచున్నవి.

### ఆఫీసరుల ట్రెయినింగు.

సైన్యాలకు నాయకులుగా వుండే ఆఫీసరుల శిక్షణకూడ జరుగుచున్నది. ఇండియాలోనున్న శిక్షణ తరగతులందు చేరిన సంస్థానాల అభ్యర్థులకు ఇంగ్లీషు రాకను, యితర రాష్ట్రాల లోకజ్ఞానం తెలియకపోవుటచేతను, నాయకత్వం అధికారం చెలాయించుటకు కొంత కష్టంగావుందని అనుభవంపై తెలిసెను. అందుచే బ్రిటిషు ఇండియాలోవలెనే సంస్థానములందుగూడ "ప్రీ కేడెటు కోర్సు" అని ఒక తరగతి యేర్పాటు చేయదలచిరి. ఇందులో ఇంగ్లీషు భాష, డ్రిల్లు, దేహపరిశ్రమ, ప్రాథమిక సైనిక ధర్మములు నేర్పబడును. తరువాత పెద్ద ఉద్యోగులకు అవసరమగు జ్ఞానమంతా నేర్పబడును. ఇండూరు సంస్థానమునందు యీ యేడు ఒక పాఠశాల యేర్పాటు చేయబడును. దానిలో వచ్చే యేడాది సరికి 110 ఆఫీసరులు తయారగుదురు. దీనికి ఇండియా ప్రభుత్వంవారు ముందుగ రూ 2,54,000 లు సాలీనా 1 లక్ష ఖర్చులకై ఒసంగిరి. మూడు నెలలు శిక్షణ యొసంగబడును.

యుద్ధ ప్రయత్నాలకు సహాయంగా సంస్థానాలనుండి రూ 2,29,76,000 లు మొత్తంగాను, రూ 37,61,000 లు సాలీనా చందాలును వసూలయినవి.

దీనికి బదులుగ సంస్థానంలో క్రొత్తగా చేర్చుకొనబడు సైన్యాలకు ఆయుధాలు, పరికరాలు బ్రిటిషు ప్రభుత్వంవారు ఉచితంగానో, ఋణంగానో అసలు ఖరీదుకో యిచ్చిరి. రెండు అశ్వికదళములను మోటారుదళములుగ మార్చుటకగు ఖర్చులను భరించిరి; 3000 గుర్రములను ఊరికే యిచ్చిరి. సంస్థాన సైన్యాలు వాడిన చమురు పెట్రోలుపై వసూలైన కష్టమ్సు పన్ను వాపసుచేసిరి; అంతేకాక అవసరమగు సహాయం అంతా చేస్తున్నారు.

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS: PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.